


అనుకున్నాడు. దానిని బాపుకొనుటకై బంధుసమేతుడై అరణ్యానికి పోయి వెదుకగా ఒకచోట ప్రసేనుని కళేబరం, సింహం కాలిజాడలు, పిదప ఎలుగుబంటి అడుగులు కనిపించాయి. ఆ దారిన పోవుచుండగా ఒక పర్వత గుహ ద్వారంబును చూచి పరివారమును అక్కడ విడిచి కృష్ణుడు గుహలోపలికి వెళ్ళాడు. అచట బాలిక ఉయ్యాలపై కట్టిన మణిని శ్రీకృష్ణుడు చూశాడు. దానిని తీసుకొని వెనక్కు వస్తుండగా బాలిక ఏడవడం ప్రారంభించింది.

అంత జాంబవంతుడు ఆవేశంగా వచ్చి శ్రీకృష్ణుని పైబడి అరచుచు, గోళ్ళతో గుచ్చుతూ, కోరలతో కొరుకుతూ ఘోరముగ యుద్ధము చేసెను. కృష్ణుడు వానిని బడద్రోసి వృక్షములు, రాళ్ళతోను, తుదకు ముష్టిఘాతములతోను రాత్రింబవళ్ళు తెలియక ఇరవై ఎనిమిది రోజులు యుద్ధము చేసెను. క్రమంగా జాంబవంతుని బలం క్షీణించింది. తననే ఓడిస్తున్న వ్యక్తి రావణ హంతకుడగు శ్రీరాముడే అని తెలుసుకున్నాడు. అంజలి ఘటించి "దేవాధిదేవా! ఆర్తజనపోషా! భక్తజనరక్షా నిన్ను



శ్రీరామచంద్రునిగా తెలిసికొంటిని. ఆ కాలమున నాయందలి వాత్సల్యముచే వరం కోరుకొమ్మనగా, నా బుద్ధి మాంద్యమున మీతో ద్వంద్వ యుద్ధం జేయవలెనని కోరుకున్నాను. భవిష్యత్తులో నీ కోరిక నెరవేరుతుందని మీరు సెలవిచ్చితిరి. అది మొదలు మీ నామస్మరణ చేయుచూ అనేక యుగములు గడిపాను, ఇపుడు తాము నా నివాసమునకు దయచేసి నా కోరిక నెరవేర్చారు. నాకు ఇక జీవితేచ్ఛ లేదు. నా అపరాధములు క్షమించి కాపాడుము. నీ కన్న వేరు దిక్కులేదు" అంటూ భీతిచే పరిపరి విధముల ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై జాంబవంతుని శరీరమంతయూ తన హస్తములచే నిమిరి భయం పోగొట్టి ఇలా అన్నాడు. శమంతక మణిని అపహరించినట్లు నాపై ఆరోపణ వచ్చింది. అపనింద బాపుకొనుటకు ఇటు వచ్చాను. కాబట్టి మణిని ఇవ్వమని కోరాడు. జాంబవంతుడు శ్రీకృష్ణునికి మణి సహితముగ తన కుమార్తెనగు జాంబవతిని కానుకగా ఇచ్చాడు.

అంత తన ఆలస్యమునకు పరితపించు బంధుమిత్ర సైన్యంబులకు ఆనందం కలిగించి కన్యారత్నం తోను, మణితోను శ్రీకృష్ణుడు పురం చేరుకున్నాడు. సత్రాజిత్తును రప్పించి పిన్న పెద్దలను ఒకచోట చేర్చి యావత్ వృత్తాంతమును చెప్పాడు. శమంతకమణి సత్రాజిత్తుకు తిరిగి ఇచ్చేశాడు. దాంతో సత్రాజిత్తు "అయ్యో! లేనిపోని నింద మోపి దోషమునకు పాల్పడితి"నని విచారించి "మణి సహితముగ తన కూతురగు సత్యభామను భార్యగా సమర్పించి, తప్పు క్షమింపు"మని వేడుకున్నాడు. శ్రీకృష్ణుడు సత్యభామను గైకొని మణి వలదని తిరిగి ఇచ్చాడు. శ్రీకృష్ణుడు శుభముహూర్తమున జాంబవతీ సత్యభామలను పరిణయమాడాడు. అంత దేవాదులు, మునులు స్తుతించి "మీరు సమర్థులు గనుక నీలాపనింద బాపుకొంటిరి మాకేమి గతి"యని ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై "భాద్రపద శుద్ధ చతుర్థిని ప్రమాదవశంబున చంద్రదర్శనమయ్యేనేని ఆనాడు గణపతిని యధావిధి పూజించి ఈ శమంతకమణి కథను విని అక్షతలు శిరంబున దాల్చువారు నీలాపనిందలు పొందకుందురుగాక" అని చెప్పాడు. అంత దేవాదులు సంతోషించి, తమ ఇళ్ళకు వెళ్ళి ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ చతుర్థి యందు దేవతలు, మహర్షులు, మానవులు తమతమ శక్తి కొలది గణపతిని పూజించి అభీష్టసిద్ధి పొందుతూ సుఖసంతోషాలతో వున్నారు. ■

మన దేవతలలో మొదట పూజించేది గణేశుడినే. మొదట మనం స్మరించేది కూడా ఆయన్నే. పూర్ణకుంభం లాంటి ఆ దేహం, బానవంటి ఆ కడుపు, పరిపూర్ణమైన ఈ జగత్తుకు గుర్తు. ఏనుగు తల, సన్నని కళ్ళు, సునిశిత పరిశీలనకు, మేధస్సుకు సంకేతాలు. ఆ వక్రతుండము, ఓంకార ప్రణవనాదానికి ప్రతీక. ఏనుగు లాంటి ఆకారాన్ని మోస్తున్నది ఒక చిన్న ఎలుక. అదే 'ఆత్మ' లోని చమత్కారం. ఆ పొట్టను చుట్టి వుండే నాగము (పాము) శక్తికి సంకేతం. జగత్తునంతా ఆవరించి వున్న మాయాశక్తే ఈ నాగము. నాల్గుచేతులు మానవాతీత సామర్థ్యాలకు, తత్త్వానికి సంకేతం. చేతిలో వున్న పాశ, అంకుశములు బుద్ధి, మనస్సులను సన్మార్గంలో నడిపించు సాధనాలకు ప్రతీకలుగా

# అంతుపట్టని వింత దేవుడు

నిలుస్తాయి. మరో చేతిలో కనిపించే దంతం ఆయనదే. వ్యాస భగవానుడు మహాభారతం రాయసంకల్పించినప్పుడు తన దంతాన్నే విరిచి ఘంటంగా మార్చాడు. ఇదంతా విజ్ఞానం కోసం చేయవలసిన కృషికి, త్యాగానికి సంకేతాలు. మరొక చేతిలో కనిపించే మోదకం-ఉండ్రాయి ఉంటుంది. కొందరి మతం ప్రకారం అది కపిత్థం (వెలక్కాయ) ఏదిఏమైనా పైనచూస్తే గట్టిదనం లోపల తియ్యదనం ఉండేదనడానికి సంకేతం. గణేశునికి మూడు కళ్ళు, మూడవ కన్ను జ్ఞాన నేత్రం. చేటలంత చెవులు మొరలాలించే ఆ దేవుడి ప్రత్యేకతను సూచిస్తాయి. నిజం చెప్పాలంటే- గణేశమూర్తి వినోదకరమేమో గాని సుందరం కాదు. అదికూడా ఒక సంకేతమే. బాహ్య సౌందర్యానికి అంతర్గత మహోన్నతికి సంబంధం లేదని ఆ రూపం సూచిస్తుంది. వినాయకునికి సంబంధించి ఇంకో ప్రత్యేకతను ఇక్కడ చెప్పుకోవాలి. భక్తులు తక్కిన దేవతల ఎదుట తప్పులు చేసివుంటే క్షమించమని చెంపలు వేసుకోవడం ఉంది కానీ, వినాయకుని ఎదుట అంత మాత్రం చాలదు. చేసిన తప్పులకు మనకు మనం శిక్ష విధించుకుంటున్నట్లుగా గుంజీలు తీయడం ఆయనంటే మనకున్న భయభక్తులకు గుర్తు. ఇలా ఎన్నెన్నో ప్రత్యేకతలు, నిగూఢ సంకేతాలు కలిగిన అధినాయకుడు మన వినాయకుడే. ■



## ఎలుక గుర్రపు స్వామి



**పిం**డితో చేసి ముద్దుల పిల్లవాని
ప్రాణమును పోసి మురిసెను పార్వతమ్మ
తండ్రిచే త్రుంచబడినట్టి తలకు బదులు
దంతి శిరముంచబడెనంట ఎంత వింత

తల్లిదండ్రుల ముద్దుల తనయుడతడు
ప్రమథ గణముల గౌరవపాత్రుడతడు
చల్లగా చూచు భక్తులనెల్ల నతడు
బొజ్జ గణపతియనబడు గుజ్జువేల్పు

చెరకు వడపప్పులన వచ్చు పరుగు లిడుచు
ఏనుగులు అశ్వములు నాకు ఏలటంచు
ఎలుకనే గుర్రముగచేసి యేగుచుండు
విఘ్నపతిగొల్వగలుగును విజయమెపుడు

మారేడు పత్రముల్ మరిమరి తెమ్మను
దానిమ్మ పూలపై తగని ప్రీతి
దేవకాంచనపూల దేహముప్పొంగును
తామరతూడుకు తలను వంచు
దర్భపోచల మీద తగని మక్కువ జూపు
వుమ్మెత్త పూలకు వుబ్బిపోవు
గన్నేరు పూలను ఎన్నైన తెమ్మను
వుత్తరేణిని గాంచ చిత్తమలరు
పండ్లు ఫలహారములకన్న భక్తులిచ్చు
పచ్చి గరికెనె తానెంతొ మెచ్చుకొనును
అల్పసంతోషి అందరి యాత్మబంధు

ఎలుక వాహనమెక్కి యేగుచుండు నెవండు
పత్రిపూజలనందు ధాత్రినెవడు
అమ్మ పార్వతిదేవి అనుగు పుత్రుండెవడు
ప్రమథ గణాలకు ప్రథముడెవడు
ముక్కంటి మెప్పించు ముద్దుకుర్రడెవండు
ఆది పూజలనందు నాతడెవడు
ఎల్లజనులను గాచు ఏకదంతుడెవండు
విఘ్నములను బాపు వీరుడెవడు
కుడుములుండ్రాళ్ళనిచ్చిన కులుకునెవడు
గజముఖంబును గల్గిన ఘనుడెవండు
వేల్పులందరు పూజించు వేల్పు ఎవడు
అట్టి దేవుని గొల్తునే ననవరతము

# శ్రీ విఘ్నేశ్వర దండకం

శ్రీ మన్మహారాజ రాజశ్వరీదేవి యంకంబులో స్తన్య పానంబుతో తన్మయత్వంబునన్ అంతులేనట్టి వాత్సల్య దుగ్ధాంబుధిన్ దేలియాడంగనిన్ జేరి యర్చించు భక్తావళిన్ సర్వవిఘ్న ప్రకాండంబులన్ రూపుమాయించి నానా వరంబుల్ ప్రసాదించి ఈరేడు లోకాల శోకాలు మాన్పించి రక్షించు చున్నట్టి యో విఘ్నరాజా భవత్పాద మందార మకరంద మాశించి నానేత్రభృంగంబులీనాడు వ్రాలెన్ కారుణ్య సారంబు ప్రసరించి కాపాడగా రమ్ము నీవానిగా నన్ను జేకొమ్ము వేదవేదాంగ వేదాంత సారంబులన్ సర్వశాస్త్రార్థ సద్విద్య సందోహముల్ నిన్ను మూలంబుగా గౌరవస్థాన మందుంచి పూజించు ముల్లోకమందెవ్వరేమైన సత్కార్య కర్మంబు జేయంగ మున్ముందుగా నీదునామంబు కీర్తించి యర్చింత్రు, నీ నామమే సర్వగీర్వాణ సంపూజ్యమై నిత్య సన్మంగళ ప్రాభవంబై ప్రకాశించు నీ రూపు సేవించి యంభోజ సంజాతుడున్ నిర్జరేంద్రుండు నానా విదార్థంబులన్ బొంది సంతోషమున్నందు, రెల్లపడున్ దేవదేవారులున్, యక్షగంధర్వ గరుడోరగాదుల్ భవన్మాయ దెలియంగ లేకెంతయో విస్మయాంతాత్ములై యుందురో దేవ షాణ్మాతురుండపుడు యుష్మత్ ప్రభావంబు శంకించి అవనీతలం బొక్క నిమిషంబులో తివిరి నేవత్తునంచున్ మనోవేగ మొప్పారగాబోవ నీవంతలో భక్తియుక్తండవై శైలరాజేంద్రతనయన్ జగన్మాతకున్ మందగమనంబుతో జుట్టిరాగా, మహాదేవుడే నీ మహాత్వంబపూ ర్వంబుగా సుస్థిరత్వంబుగా చాటడామున్ను! రజతాచలేంద్రాగ్ర భాగంబునన్ శార దేందుప్రభా భాసితాశావకాశంబునన్ సహజ గాంభీర్య గమనంబుతో సంచరింపంగ దర్శించి సనకాది సన్మౌనిబృందంబు పూర్ణేందుబింబంబు నిర్జించు నీ యొక్క మత్తేభవక్త్రంబు నీ గుజ్జురూపున్ తదేకంబుగా జూచి యానందమున్ బొందదా! తారకానాథుడానాడు సౌందర్యశోభా సమోపేత శృంగార సర్వాంగుడై తన్ను కాంతా సమూహంబు మోహంపు చిరునవ్వుతో మంచి నీరాజనంబుల్ సమర్పింపగా అన్నుమిన్నేమియున్ గానగాలేక నీ హ్రస్వరూపంబు వీక్షించి నవ్వంగ నా వారిజారిన్ భవత్కోపదావాగ్ని కిన్నాహుతిన్జేయ నుంకించినన్ భీతిచే గర్వమంతన్ విసర్జించి దాసోహమంచున్ నినున్ జేరగా పార్వతీనాథు జూటాగ్ర చూడామణిన్ జూచి వర్షవర్షంబునన్ భక్తియుక్తంబుగ సర్వపుష్పంబులన్, సర్వ పత్రంబులన్, ద్రాక్ష, జంబీర, నారంగ, రంభాది నానాఫలంబుల్ సమర్పించి యర్చించు సద్భక్త బృందంబులన్, శోభనంబుల్ ప్రసాదించి రక్షింతు నంచున్ వచింపంగ, నీలదాకాశ మధ్యంబులో నుండి




విద్యుల్లతా భాసురాంగుల్ నిలింపాగనల్ దివ్య ప్రసూనంపు వర్షంబు వర్షించి హర్షింపరా! మోదకాఖాది మూషికారోహణానందలోలుండవై ముమ్మార్తులన్ మూడు లోకంబులన్ మంత్రముగ్ధాత్ములన్ జేయవానీవు! ద్వారకానాథుడానాడు సత్రాజితున్ జేరరావించి నీ ఇంటిలో భానుదత్తం బనావృష్టి వార్యంబుగానున్న మణిరాజమిమ్మన్న, మోమాటమింతైన బాటింపకన్ వాడుశౌరిన్ తిరస్కార వాక్యంబులన్ బల్కె నొక్కింతకాలంబుమీదన్ ప్రసేనుండు తమ్ముండు మణిబూని చరియించుచుండంగ కాంతార మధ్యంబులో సింగ మొక్కండు దుష్టోగ్రదంతంబులన్ వానికాయంబు గాయంబుగా జేసి వధియింప, సత్రాజితుండీయదార్థంబు నింతైన గుర్తింపకన్ కృష్ణుడే వాని ప్రాణంబులన్ దీసి మణిగొన్న వాడంచు దుష్ట ప్రచారంబు గావింపగా, రుక్మిణీవల్లభుండాత్మ చింతించి "యేపాప మేమాత్ర మెరుగంగలేనైన దుష్కీర్తివాటిల్లె యోపార్వతీపుత్రయో మేరుగంభీర సద్గాత్ర పాపంబు పుణ్యంబులన్, సర్వకర్మం బులన్ సాక్షివీవేకదా" యంచు ప్రార్థించి, షడ్రసోపేత మృష్టాన్నముల్, పంచ బక్ష్యంబులన్, భక్తినైవేద్యమర్పించి పూజించి, ఘోరాటవిన్ బాగుగాలించి గాడాంధ కార ప్రపూర్ణంబునై దుర్గమంబై పాదసంచారియై పోయి, యుద్ధంబులో సాటిలేనట్టి మేటిన్ మహాకాయ భల్లూకనాథున్ కడున్నొవ్వగాజేసి మెప్పించి, భానురత్నంబుతో భామతో వచ్చి నిర్ముక్త పాపుండునై కీర్తిధాముండునై యొప్పె భవత్కర్ణ సంచాలనోద్భూత ఝుంఝూనిలం బస్మదీయంపు పాపౌఘ సంజన్య దురితావళిన్ పంచబంగాళ మొనరించు సొంపుతావుల్ గుబాళించు పుష్పంబులా లేవు అర్పింప నామస్తకంబీదు చరణంబులందుంచినాడన్ భవత్ప్రీతిగా నేలుకోవయ్య యో సిద్ధి గణనాథ సర్వ కార్యార్థసిద్ధిన్ ప్రసాదించి రక్షింపుమోదేవ నిన్నెంత కీర్తించినన్ తృప్తియేలేదు మాకింత సంసార మోహంబులో నుండి కూపస్థ మండూకలీలన్ గృహంబున్ విశాల ప్రపంచంబుగా నెంచి నీపాదకంజంబులన్ మ్రొక్కి పూజింపగా నిశ్చలత్వంబు శూన్యంబు అజ్ఞాన తిమిరాంధకారంబులో పూర్ణజ్యోతి స్వరూపంపు నీవే కదా మమ్ము దరిజేర్చి గాపాడుమో ఏకదంతా, బృహత్కీర్తిమంతా సదా విఘ్నహర్తా జగత్కార్యకర్తా నమస్తే నమస్తే నమస్తే నమః.

# విఘ్నేశ్వర జననం



విఘ్నేశ్వర జన్మ వృత్తాంతంపై పలు రకాల గాథలున్నాయి. వాటిని ఒక్కొక్క పురాణం ఒక విధంగా వర్ణించింది. వాటిలో వరాహ పురాణం పేర్కొన్న విఘ్నేశ్వర జన్మ వృత్తాంతం తక్కిన పురాణ కథలకు భిన్నంగా ఉంది. ఈ పురాణం విఘ్నేశ్వరుడు ఆకాశం నుంచి జన్మించినట్లు చెప్పింది. రాక్షసుల బాధ ఎక్కువ కావ డంతో ఆ బాధ నుంచి విముక్తి చెందే ఉపాయం చెప్పమని ఋషులు, దేవతలు శివుడిని అడిగారు. పరమశివుడు ఈ విష యమై సుదీర్ఘంగా ఆలోచిస్తూ ఒకసారి తల ఎత్తి ఆకాశం వంక చూశాడు. అప్పుడు ఆయన కంటికి అత్యంత సుందరంగా పార్వతీ దేవి కనిపించింది. శివుడు అప్రయత్నంగా 'పంచభూతాలలో తక్కిన వాటికంతా రూపం ఉండగా ఆకాశానికి ఎందుకు లేదు' అని ప్రశ్నించాడట! జగజ్జనని అయిన పార్వతిని చూచి పరమ శివుడే అట్లా ప్రశ్నించడంతో ఆకాశం పుత్రరూపం దాల్చి శివుడి ఎదుట నిలిచింది. అదెంత సుందర రూపమంటే పార్వతీదేవి కూడా చంచల చిత్తంతో చూసిందట. ఆ బాలుడు ఇతర దేవతా స్త్రీలను కూడా అట్లాగే భ్రమింప చేయడంతో పరమ శివుడికి కోపం వచ్చి "నీవు ఏనుగు తల, బాన కడుపుతో వికార రూపుడవుకమ్మని' శపించాడు. వెంటనే ఆకాశం నుంచి జన్మించిన ఆ బాలుడు ఆ రూపంలోకి మారాడు. ఈశ్వరుని వల్ల విఘ్నత చెందడం వల్ల ఆయనకు విఘ్నేశ్వరుడనే పేరు వచ్చింది. అంతటితో శివుడి కోపం చల్లారలేదు ఆయన శరీరం చెమర్చింది. ఆ చెమట చుక్కల నుంచి వేనకు వేలు గజాస్యులు పుట్టుకొచ్చారు. ఆ తర్వాత దేవతలంతా పరమశివుడిని ప్రార్థించి శాంతచిత్తుని చేశారు. అలా పుట్టిన గజాస్యులు విఘ్నేశ్వరుని పరివారంగా ఉంటుందని, గణాధిపతిగానేకాక ప్రతి కార్యంలో ముందుగా విఘ్నేశ్వరుడు పూజింపబడతాడని శివుడు అనుగ్రహించాడు. వరాహ పురాణం ప్రకారం విఘ్నేశ్వరుడు ఆకాశ స్వరూపం. ■

# ఫస్టు మార్కొస్తేను పదహారయా!

ఓ బొజ్జ గణపయ్య నీ బంట్లు మేమయ్య
ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా
మా ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా
మార్కులెన్నో వచ్చి మేలుగా పాసైతే
కోర్కె తీరా నిన్ను కొలిచేమయ్యా



మేళతాళాలు మారు మోగేటట్లు
ఉత్సవాలెన్నెన్నో చేసేమయ్యా
పోయినసారి మరీ పదమూడే వచ్చాయి
ఈసారైనాను ఇరవై దాటిస్తేను
కొబ్బరికాయలూ కొడతామయ్యా
నీకు పెద్దపెట్టున పూజ పెడతామయ్యా
ముప్పై ఐదొస్తేను మూడు కొడతామయ్యా
నల్లభై ఐదొస్తేను ఏడు కొడతామయ్యా
ఫస్టు మార్కొస్తేను పదహారయ్యా
పదహారయ్యా తండ్రి పదహారయ్యా
కొబ్బరికాయలు నీకు పదహారయ్యా
ఓ బొజ్జ గణపయ్య నీ బంట్లు మేమయ్య
ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా



# నిమజ్జనం ఎలా చేయాలి?

వినాయక చవితికి, దసరాకు నవరాత్రులు నిర్వహించడం సంప్రదాయం. తొమ్మిది రోజుల పాటు పూజలు నిర్వహించి, ఆ తరువాత దేవతామూర్తులను నిమజ్జనం చేయడం అనాదిగా వస్తున్నది. హైదరాబాద్‌తో పాటు పలు ప్రాంతాల్లో గణేశ నిమజ్జనం ఘనంగా నిర్వహిస్తున్నారు. వినాయకచవితి నాడు కానీ, 3, 5, 7, 9వ రోజు కానీ నిమజ్జనం నిర్వహించాలి. అంటే బేసి సంఖ్య వున్న ఏ రోజైనా స్వామిని నిమజ్జనం చేయవచ్చు. నిమజ్జనం చేసే ముందు గణపతికి భక్తితో ధూపదీప నైవేద్యాలు సమర్పించాలి. తీర్థ ప్రసాదాలను అందరూ భుజించి ఆ తరువాత సంప్రదాయ బద్ధంగా నిమజ్జనం ఊరేగింపు నిర్వహించాలి. నిమజ్జన ఊరేగింపు సమయంలో ఉత్సాహంతో కేరింతలు కొట్టడం, పాటలు, నృత్యాలు సహజమే. గణపతి విగ్రహాన్ని ప్రతిష్ఠించే సమయంలో ఎంతో శాస్త్రోక్తంగా పూజ చేసి మరీ ఉత్సవాలను ప్రారంభిస్తాం. మరి నిమజ్జనం చేసే సమయంలో ఎటువంటి సంప్రదాయం పాటించాలి? ఏ మంత్రాన్ని.. ఏ శ్లోకాన్ని పఠిస్తూ ఆ గణనాథుడ్ని నీటిలోకి వదలాలి? నిమజ్జన ఉత్సాహ సమయంలో ఈ సంప్రదాయాన్ని పాటించే వారు చాలా తక్కువమంది వుంటారు... అసాధ్యమైన విషయమేమీ కాదు కాబట్టి ప్రతి ఒక్కరూ గణనాథుడ్ని నీటిలోకి జారవిడిచే ముందు **'శ్రీ గణేశం ఉద్వాసయామి ... శోభనార్థం పునరాగమనాయచ'** అని చెప్పుకోవడం సంప్రదాయం. ■

**ఓం శాంతి శాంతి శాంతిః**

**స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం**
**న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః**
**గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం**
**లోకస్సమస్తాస్సుఖినోభవంతు**






**తె**లుగు రాష్ట్రాల్లో వినాయకచవితి అంటే మొదటగా మదిలో మెదిలేది భాగ్యనగరంలోని ఖైరతాబాద్ గణేశుడే. వినాయక చవితి సందర్భంగా ఖైరతాబాద్ భారీ గణపతికి 11 రోజుల పాటు నిర్వహించే ఉత్సవాలు లక్షలాది మందిని భక్తిపరవశుల్ని చేస్తున్నాయి. దేశవ్యాప్తంగా ఖ్యాతి గడించిన ఖైరతాబాద్ వినాయకచవితి ఉత్సవాలకు 62 సంవత్సరాల చరిత్ర ఉంది. భక్త కోటిపై తన కరుణ నిండిన చూపుల్ని ప్రసరింపజేస్తున్నట్లు కొలువు తీరే ఖైరతాబాద్ భారీ గణపతి ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందడంతో పాటు ఎన్నో రికార్డులను సొంతం చేసుకున్నాడు.

**ఒక్క అడుగు నుంచి 60 అడుగుల దాకా..**

ఖైరతాబాద్ గణపతి ఉత్సవాలు 1954లో ఒక అడుగు ఎత్తు గణేశుడి విగ్రహంతో ప్రారంభమయ్యాయి. అప్పట్లో ఖైరతాబాద్ కౌన్సిలర్ సింగరి శంకరయ్య స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా బాల గంగాధర్ తిలక్ ఇచ్చిన పిలుపు మేరకు ఖైరతాబాద్‌లో వినాయక విగ్రహాన్ని ఏర్పాటు చేసి ఉత్సవాలకు శ్రీకారం చుట్టారు. తొలి ఏడాది వినాయకుడి విగ్రహాన్ని పెట్టడమే కాకుండా నగరం మొత్తం తిరుగుతూ వినాయక నవరాత్రులను అందరూ ఘనంగా నిర్వహించాలని కరపత్రాలు పంచారు శంకరయ్య. అప్పటి నుంచి ఏటా వినాయకుడి ఎత్తు పెంచుతూ ఉత్సవాలు ఘనంగా నిర్వహిస్తున్నారు. 1979లో 20 అడుగుల వినాయకుడిని తయారుచేసి ఇక్కడ ప్రతిష్ఠించారు. 1981లో 25 అడుగుల నాట్య వినాయకుడు, 1982లో మూషిక వాహన వినాయకుడి ద్వారా ఖైరతాబాద్ గణపతికి రాష్ట్రవ్యాప్తంగా గుర్తింపు లభించింది. 1987 నుంచి వినాయకుడి ఎత్తును క్రమంగా పెంచుతూ వెళ్లారు. 2015లో 60 అడుగుల భారీ గణపతికి ఘనంగా వేడుకలు నిర్వహించారు.

## భాగ్యనగరి బాహుబలి

# ఖైరతాబాద్ గణపతి

సింగరి శంకరయ్య మరణానంతరం అతడి సోదరుడు సింగరి సుదర్శన్ ఆధ్వర్యంలో ఈ ఉత్సవాలు జరుగుతున్నాయి. అప్పట్లో హైదరాబాద్‌లో కేవలం పాతబస్తీ, రాంకోట్, ధూల్‌పేట, ఖైరతాబాద్‌లలో మాత్రమే ఈ ఉత్సవాలు జరిగేవి. 1985 వరకు ఖైరతాబాద్ భారీ గణపతిని నెల రోజుల పాటు పూజించి విజయదశమి (దసరా) రోజున నిమజ్జనం చేసేవారు. అప్పట్లో ఈ వినాయకుడి వద్ద నెల రోజుల పాటు సాంస్కృతిక కార్యక్రమాలు రాత్రంతా జరిగేవి. నిమజ్జనం ముందు రోజున జరిగే శివతాండవాన్ని చూసేందుకు పెద్ద ఎత్తున భక్తులు వచ్చేవారు. 1954లో వినాయకుడిని ఓ చిన్న పాడుబడ్డ దేవాలయం ఎదురుగా (ప్రస్తుతం గ్రంథాలయంలో) ప్రతిష్ఠించేవారు. ఆ దేవాలయంలో అసలు రూపం ఎవరికీ తెలియకున్నా గణపతి దేవాలయంగా భావించి సింగరి శంకరయ్య అక్కడ ఎప్పటికీ చిరస్థాయిగా నిలిచిపోయే భవనాన్ని నిర్మించాలని సంకల్పించి అజంతా శిల్పాల్లోని 19వ గుహ ఆకారంలో గ్రంథాలయ భవనాన్ని నిర్మించారు. నిర్మాణంలో ఉన్న సమయంలో ఈ భవనం కింది అంతస్తులో 10 అడుగుల వినాయకుడిని పెట్టేందుకు అనువుగా ప్రత్యేక ఏర్పాటు చేశారు. రానురాను భక్తుల ఆదరణ పెరగడం, ప్రజల డిమాండు మేరకు ఎత్తును పెంచాల్సి రావడంతో ఈ గ్రంథాలయ ఆవరణలో వినాయకుడిని ప్రతిష్ఠిస్తున్నారు.



సింగరి శంకరయ్య

**శ్రీ చండీ కుమార అనంత మహాగణపతిగా...**

ఖైరతాబాద్ గణపతి ఈ సంవత్సరం శ్రీ చండీ కుమార అనంత మహాగణపతిగా భక్తులకు దర్శనమిస్తున్నారు. 2014లో షష్ఠిపూర్తి ఉత్సవాలు జరుపుకున్న అనంతరం 2015 నుంచి ఒక్కో అడుగు తగ్గిస్తూ ఈసారి 57 అడుగుల విగ్రహాన్ని తయారు చేస్తామని ప్రకటించినా.. విగ్రహ శిల్పి రాజేంద్రన్ 60వ జన్మదినం సందర్భంగా ఈసారి 60 అడుగుల ఎత్తుతోనే విగ్రహం తయారు చేశారు. 28 అడుగుల వెడల్పుతో భారీ ఆకారంలో గణపతి చూడముచ్చటగా ముస్తాబయ్యాడు. ఈ సంవత్సరం మహాగణపతిని చండీమాత, కుమారస్వామిలతో పాటు పరమశివుడు, మహిషాసురమర్దినుల సమేతంగా పూజిస్తే అందరికీ శుభం జరుగుతుందని ప్రముఖ సిద్ధాంతి విఠలశర్మతో పాటు పలువురు సూచించడంతో ఆ ఆకారంలో గణపతిని సిద్ధం చేశారు. వరాలిచ్చే

కల్పవృక్షం కింద 14 పడగలతో కూడిన అనంత నాగు తలపై ఉంచుకొని 8 చేతులలో అంకుశ, పాశ, శంఖు, చక్ర, పుష్ప, గద, ఆశీర్వాద, లడ్డూలు ధరించిన గణపతి 40 టన్నుల బరువుతో తయారయ్యారు. గణపతితో పాటు ఆయనకు కుడివైపున 15 అడుగుల పొడవు, 9 అడుగుల వెడల్పుతో సింహవాహనంపై చండీమాత, 12 అడుగుల ఎత్తు, 8 అడుగుల వెడల్పుతో ఎడమవైపున కుమారస్వామి చూడముచ్చటగా కొలువుదీరారు. వీరితో పాటు గణపతికి ఇరువైపుల మహాకాల సదాశివుడు మంచు పర్వతాల మధ్య శాంతమూర్తిగా 16 అడుగుల ఎత్తు, 15 అడుగుల వెడల్పుతో తలపై గంగమ్మ నోటి నుంచి జాలువారుతున్న జలధారతో భక్తులను ఇట్టే ఆకర్షిస్తుండగా మరోవైపున 20 అడుగుల ఎత్తు, 15 అడుగుల వెడల్పుతో మహిషాసురమర్ధిని ఉగ్రస్వరూపంతో కూడిన ఘట్టాన్ని కళాకారులు అద్భుతంగా తీర్చిదిద్దారు.

### 94 రోజులు.. 150 మంది నిపుణులు...

లక్షలాది మంది భక్తులు ఆరాధ్య దైవంగా కొలిచే ఈ భారీ గణపతికి ఓ విశిష్ఠత ఉంది. విగ్రహాన్ని ఎక్కడి నుంచి చూసినా స్వామి మనల్నే చూస్తున్న అనుభూతి భక్తులందరికీ కలిగే విధంగా రూపొందించడంలో శిల్పి చాతుర్యం దాగుంది. ఎన్నో దేవాలయాలతో పాటు కళాక్షేత్రాలను తయారు చేసిన చెన్నైకి చెందిన చినస్వామి రాజేంద్రన్ చేతుల మీదుగా ఈ విగ్రహం ముస్తాబైంది. మరో విశేషం ఏమిటంటే 11 రోజుల పాటు గణపతి స్వయంగా ఇక్కడ కొలువు ఉంటాడని భక్తుల ప్రగాఢ విశ్వాసం. దానికి తగ్గట్లుగా 150 మంది నిపుణులు, కళాకారులు 94 రోజుల పాటు రాత్రింబవళ్లు శ్రమించి గణపతి మూర్తి రూపకల్పనలో భాగస్వాములయ్యారు.


శిల్పి రాజేంద్రన్

### 11 రోజుల ఉత్సవం... 10 కోట్ల వ్యాపారం

ఖైరతాబాద్ గణపతిని దర్శించుకునేందుకు ఇతర రాష్ట్రాలతో పాటు విదేశాల నుంచి సైతం ఎంతో మంది భక్తులు వస్తుండడంతో ఈ ప్రాంతం 11 రోజుల పాటు మహాపుణ్యక్షేత్రాన్ని తలపిస్తుంది. వినాయక ఉత్సవాలు జరిగే 11 రోజుల్లో దాదాపు 20 లక్షల మంది భక్తులు స్వామిని దర్శించుకుంటారు. వినాయక చవితి నుంచి నిమజ్జనం వరకు ఖైరతాబాద్‌లో దాదాపు 1200 మంది తమ వస్తువులను విక్రయించడం ద్వారా దాదాపు 10 కోట్ల రూపాయల వ్యాపారం చేస్తుంటారని నిపుణులు అంచనా.

దాదాపు 40 టన్నుల బరువు, 60 అడుగుల ఎత్తుతో అదే ప్రాంతంలో తయారైన భారీ గణపతిని నిమజ్జనం కోసం తరలించడం కూడా ఓ విశేషమే. వేలాది మంది భక్తుల సమక్షంలో గణపయ్యను అందరి అంచనాలకు తగ్గట్లు, సెంటిమెంట్‌ను గౌరవిస్తూ అవలీలగా గాలిలోకి ఎత్తి ఊరేగింపు ట్రాలీపై వుంచడం, నిమజ్జన ఘట్టం వద్ద, అదే విధంగా అన్ని వైపులా ఉన్న భక్తులకు చివరి సారిగా దర్శనమిప్పించి గంగమ్మ ఒడికి మహాకాయుడు చేర్చడం ఓ మహత్తర ఘట్టం. గణపతిని ఖైరతాబాద్ నుంచి హుస్సేన్‌సాగర్ తీరానికి తరలించేందుకు 26 చక్రాలు, 70 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పుతో ఉండే అత్యాధునిక ట్రాలీని వినియోగిస్తారు. దీనికి దాదాపు 50 టన్నులకు పైగా బరువును మోసే సామర్థ్యం ఉంది. భక్తుల మనోభావాలకు అనుగుణంగా క్రేన్ ఆపరేటర్ ఏ చిన్న పొరపాటు లేకుండా గణపతిని ఎత్తి ట్రాలీలో పెట్టడం, అక్కడి నుంచి ట్రాలీ శోభాయాత్రగా నిమజ్జన స్థావరానికి క్షేమంగా వెళ్ళడం, గణపతితో పాటు శోభాయాత్రలో వేలాది మంది భక్తులు వెంట నడవడం దేశంలో ఎక్కడా కనిపించని అపూర్వ దృశ్యాలు భాగ్యనగరం సొంతం. వేలాది మంది భక్తుల జయజయ ధ్వానాల మధ్య ఖైరతాబాద్ గణపతి సాగర జలాల్లో నిమజ్జనం అయ్యే దృశ్యం నేత్రపర్వంగా వుంటుంది.




ముస్తాబవుతున్న చండీకుమార అనంత మహాగణపతి

### ఈసారి స్వామి చేతిలో కృత్రిమ లడ్డూ

భారీ గణపతి ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో రికార్డులను సొంతం చేసుకోగా, ఆయన చేతిలో నైవేద్యంగా పెట్టే లడ్డూ కూడా రికార్డులను తిరగరాసింది. 2010వ సంవత్సరం నుంచి కాకినాడ తాపేశ్వరంకు చెందిన సురుచి ఫుడ్స్ అధినేత మల్లిబాబు భక్తిభావంతో లడ్డూను స్వామికి పెడుతూ వచ్చారు. 2010వ సంవత్సరంలో 500 కిలోలతో ప్రారంభించి, 2015లో 6వేల కిలోల వరకు లడ్డూ పరిమాణాన్ని పెంచుతూ వెళ్లారు. ఈ క్రమంలో ఆయన పలు రికార్డులు సొంతం చేసుకున్నారు. 2016లో 500 కిలోల లడ్డూ తెచ్చినా దాన్ని స్వామి చేతిలో కాకుండా ఆయన పాదాల వద్ద నైవేద్యంగా వుంచడంతో మనస్తాపానికి గురైన సురుచిఫుడ్స్ అధినేత ఈసారి నుంచి స్వామి లడ్డూ నైవేద్యం ఇవ్వలేనని వెల్లడించారు. దాంతో భారీ లడ్డూను పోలిన విధంగా కృత్రిమ లడ్డూను గణపతి చేతిలో అమర్చారు.

**- వెనగంటి లక్ష్మణ యాదవ్**
ఆంధ్రజ్యోతి, ఖైరతాబాద్




**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్స్
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి


# ఆస్తమా, సైనసైటిస్‌లకు హోమియోతో శాశ్వత పరిష్కారం

**ఆస్తమా, సైనసైటిస్....** రెండు వేరు వేరు వ్యాధులైనా రెండింటికి సంబంధం ఉంది. దీర్ఘకాలంగా సైనసైటిస్‌తో బాధపడుతున్నప్పుడు ఆస్తమాగా మారే అవకాశం ఉంటుంది.

కారణాలేంటి ? సైనస్‌లో ఉండే డిఫెన్స్ మెకానిజం చాలా వరకు సూక్ష్మక్రిములు శరీరంలోకి రాకుండా అడ్డుకుంటుంది. కానీ ఠి మైక్రోబ్స్ కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి ఆస్తమాకు, సైనసైటిస్‌కు కారణమవుతాయి.

**లక్షణాలు :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినప్పుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం, పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్లుగా ఉంటుంది. పిల్లికూతలు ఉన్నంత మాత్రాన ఆస్తమాగా నిర్ధారణకు రాకూడదు. పరీక్షలు చేయించిన తరువాతే నిర్ధారణకు రావాల్సి ఉంటుంది.

**హోమియో వైద్యం :** మూల కారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత వ్యాధి తిరిగి రావడం అంటూ జరగదు. ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. సైనసైటిస్, ఆస్తమా సమస్యలు సమూలంగా తొలగిపోతాయి.

# మైగ్రేన్ తలనొప్పి జాడే ఉండదు

కొందరికి తలనొప్పి వచ్చిందంటే వెలుతురు చూడలేరు, చిన్న శబ్దాలను వినలేరు. తలనొప్పి అంత తీవ్రంగా వుంటుంది. మరి కొందరికి రెండు, మూడు రోజులకొకసారి తలనొప్పి వస్తూనే ఉంటుంది. తలనొప్పితో పాటు వాంతులు, తలతిరగడం వంటి లక్షణాలుంటాయి. ఏ పని చేసుకోలేకపోతారు. నెలలో 10 రోజులు లేదా సెలవు పెట్టాల్సివస్తుంది. ఏదైనా పనిచేస్తున్నప్పుడు తలనొప్పి మరింత తీవ్రమవుతుంది. తీవ్రమైన తలనొప్పి వల్ల ఏ పనీ చేసుకోలేకపోతారు. వికారం, వాంతులు, వెలుతురు చూడలేకపోవడం, శబ్దాలను వినలేకపోవడం వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణం ఏమై ఉంటుంది ? :** సైనసైటిస్‌తో బాధపడే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. తీవ్రమైన ఒత్తిడికి గురయ్యే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. కాబట్టి ముందుగా కారణాలను తెలుసుకునే ప్రయత్నం చేయాలి. మెదడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల కావడం, రక్తనాళం, ఎన్‌లార్జ్‌మెంట్ కావడం వంటివి తలనొప్పికి కారణమవుతుంది. అలర్జీ, లైట్, పర్ఫ్యూమ్, స్ట్రెస్, స్మోకింగ్, ఆల్కహాల్, సమయానికి భోజనం చేయకపోవడం వంటి కారణాలు ఇందులో ఉంటాయి.

**హోమియో చికిత్స తరువాత :** మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియోపతి కేవలం లక్షణాలు కాకుండా మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుంది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు.

# నడుమునొప్పి, మెడనొప్పి, సయాటికాకు హోమియో తో పరిష్కారం

**నడుం నొప్పి:** నడుము భాగంలో నొప్పి వస్తున్నట్లయితే లంబార్ స్పాండిలోసిస్ అంటారు. నడుము నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. లంబార్ స్పాండిలోసిస్‌తో దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది. కొందరిలో వెన్ను చివరి భాగంలో నొప్పి వస్తుంటుంది. దీన్ని సాక్రం పెయిన్ (టేల్ పెయిన్) అంటారు.

**మెడనొప్పి:** ఇటీవల కాలంలో ఎక్కువ మంది మెడ నొప్పి సమస్యతో ఆసుపత్రుల చుట్టూ తిరగడం కనిపిస్తోంది. మెడ భాగంలో వచ్చే ఈ నొప్పిని సర్వైకల్ స్పాండిలోసిస్ అంటారు. మెడ, వెన్నుపూసలో మార్పులు రావటం వల్ల నరాల మీద ఒత్తిడి పడి ఈ సమస్య తలెత్తుతుంది.

**కీళ్లనొప్పులకు** సంబంధించిన వ్యాధులలో సయాటికా ఒకటి. శరీరంలో అతి పొడవైన నరం సయాటికా. ఇది తొడల నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్ల దాకా వ్యాపించి ఉంటుంది. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన జీవనశైలిలోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనపడతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఈ నరం శరీరంలో ఎంత దూరం వ్యాపిస్తే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది. సయాటిక్ నరం ఒత్తిడికి గురి కావడం వల్ల వచ్చే సమస్య కావడం చేత దీనికి సయాటికా అన్న పేరు స్థిరపడింది.


మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం, తిరుపతి
ఫోన్: 7842 108 108, 7569 108 108


V6 లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2.30 కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2.30 కి
10 టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4.30 కి
డాక్టర్ గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# అనుగ్రహం

27 ఆగస్టు - 2 సెప్టెంబర్ 2017

డాక్టర్ పి.ఎ. రామన్



**మేషం**

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఆర్థికస్థితి సామాన్యం. యత్నాలు మందకొడిగా సాగుతాయి. దుబారా ఖర్చులు అధికం. చేతిలో డబ్బు నిలబడదు. రావలసిన ఆదాయాన్ని లౌక్యంగా వసూలు చేసుకోవాలి. బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. సోమ, మంగళ వారాల్లో పనులు ముందుకు సాగవు. వ్యవహారాల్లో తప్పటడుగు వేసే ఆస్కారం ఉంది.



**తుల**

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

అంచనాలు ఫలిస్తాయి. పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. పొదుపు చేసిన సొమ్ము అందుతుంది. పనులు నిదానంగా పూర్తవుతాయి. పరిచయస్తులను కలుసుకుంటారు. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. ఆత్మీయులకు సాయం అందిస్తారు. విలువైన వస్తువులు జాగ్రత్త. పోగొట్టుకున్న పత్రాలు తిరిగి పొందుతారు. ఒక వ్యవహారంలో మీ జోక్యం అనివార్యం.



**వృషభం**

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

కొత్త పనులకు శ్రీకారం చుడతారు. ఖర్చులు అంచనాలను మించుతాయి. అవసరాలు వాయిదా వేసుకుంటారు. అవకాశాలు చేజారినా ఒకందుకు మంచిదే. మీ కృషి త్వరలో ఫలిస్తుంది. పిల్లల అత్యుత్సాహాన్ని అదుపు చేయండి. అకారణంగా మాటపడవలసి వస్తుంది. ఆది, గురు వారాల్లో అనవసర విషయాల్లో జోక్యం తగదు. దంపతుల మధ్య సఖ్యత నెలకొంటుంది.



**వృశ్చికం**

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

ఆర్థికంగా ఫర్వాలేదనిపిస్తుంది. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పరిచయాలు విస్తరిస్తాయి. ఒప్పందాలకు అనుకూలం. భేషజాలు, మొహమాటాలకు పోవద్దు. మీ ఇష్టాయిష్టాలను సున్నితంగా వ్యక్తం చేయండి. పనులు చురుకుగా సాగుతాయి. కొన్ని ఇబ్బందుల నుంచి బయటపడతారు. ఆది, సోమ వారాల్లో ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది.



**మిథునం**

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

ప్రేమానుబంధాలు బలపడతాయి. పదవులు, సభ్యత్వాలు స్వీకరిస్తారు. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. రోజువారీ ఖర్చులే ఉంటాయి. అయినవారితో ఉల్లాసంగా గడుపుతారు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. పనులు స్వయంగా చూసుకోవాలి. రశీదులు, పత్రాలు జాగ్రత్త. ఆత్మీయులకు సాయం అందిస్తారు.



**ధనుస్సు**

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

మనోధైర్యంతో ముందుకు సాగుతారు. సన్నిహితుల ప్రోత్సాహం ఉంటుంది. పనులు వేగవంతమవుతాయి. ఖర్చులు విపరీతం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. మంగళ, బుధ వారాల్లో అనవసర విషయాల్లో జోక్యం తగదు. జీవిత భాగస్వామి వైఖరి అసహనం కలిగిస్తుంది. పిల్లల విషయంలో శుభపరిణామాలు సంభవం.



**కర్కాటకం**

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. రుణ విముక్తులవుతారు. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. అభియోగాలు, విమర్శలకు దీటుగా స్పందిస్తారు. సమర్థతకు గుర్తింపు లభిస్తుంది. పనుల సానుకూలతకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. గురు, శుక్ర వారాల్లో అప్రియమైన వార్తలు వినవలసి వస్తుంది. పెట్టుబడులకు అనుకూలం. వాహనం నడిపేటపుడు జాగ్రత్త.



**మకరం**

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

కొత్త యత్నాలకు శ్రీకారం చుడతారు. ఆంతరంగిక విషయాలు గోప్యంగా ఉంచండి. పరిచయం లేని వారితో జాగ్రత్త. నిలిపివేసిన పనులు పూర్తి చేస్తారు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. డబ్బుల్ని మితంగా వ్యయం చేయండి. వ్యవహారాలు, లావాదేవీల్లో ఏకాగ్రత వహించండి. సలహాలు, సాయం ఆశించవద్దు. స్వయంకృషితో అనుకున్నది సాధిస్తారు.



**సింహం**

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

గృహంలో చికాకులు తలెత్తుతాయి. ఏ విషయంపై ఆసక్తి ఉండదు. కొన్ని విషయాలు పట్టించుకోవద్దు. విమర్శించినవారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. ఖర్చులు విపరీతం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. నోటీసులు, పత్రాలు అందుకుంటారు. పెట్టుబడుల విషయంలో పునరాలోచన అవసరం. దళారులను విశ్వసించవద్దు.



**కుంభం**

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

అవిశ్రాంతంగా శ్రమిస్తారు. కష్టానికి తగిన ప్రతిఫలం ఉంటుంది. ఉపకారానికి ప్రత్యుపకారం పొందుతారు. ఖర్చులు సామాన్యం. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. పరిచయస్తుల రాక ఇబ్బంది కలిగిస్తుంది. శనివారం నాడు పనులు హడావుడిగా సాగుతాయి. స్థిరాస్తి అమర్చుకోనే దిశగా యత్నాలు సాగిస్తారు. ప్రకటనలు, దళారులను విశ్వసించవద్దు.



**కన్య**

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

ఈ వారం అనుకూలదాయకమే. ధనలాభం, వాహన యోగం ఉన్నాయి. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. పొదుపు పథకాలు, పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. కొన్ని పనులు ఆకస్మికంగా పూర్తి చేస్తారు. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించండి. విలువైన వస్తువులు జాగ్రత్త.



**మీనం**

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఒక వ్యవహారంలో డబ్బు అందుతుంది. రుణ బాధలు తొలగుతాయి. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. శుభకార్యానికి యత్నాలు ప్రారంభిస్తారు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. కీలక విషయాల్లో పట్టు సాధిస్తారు. కుటుంబీకులతో ఉల్లాసంగా గడుపుతారు. ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. ఆది, సోమ వారాల్లో మీ గౌరవానికి భంగం కలుగవచ్చు.

# కాన్స్టిట్యూషనల్ హోమియోపతి చికిత్సతో 'డయాబెటిస్' నియంత్రణ సులభం



**తీపి రుచులంటే ఇష్టం...**
**కానీ డయాబెటిస్‌తోనే కష్టం!**
హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో
డయాబెటిస్ నియంత్రణకు సరైన వైద్యం

నాకు సహజంగా తియ్యటి పదార్థాలంటే ఎంతో ఇష్టం. కానీ డయాబెటిస్ కారణంగా ఆయా తీపి రుచులన్నింటికీ ఒక్కసారిగా దూరం కావటం చాలా కష్టమైంది. అంతేకాకుండా నిత్యం నేను భోజనంలో అమితంగా ఇష్టపడే అనేక రకాల వంటకాల రుచుల గురించి నాకు బెంగ పట్టుకుంది. అంతవరకు నేనెంతో ఇష్టంగా భావించే అన్ని రకాల స్వీట్స్ రోజూ ఎంజాయ్ చేసేవాణ్ణి. కానీ ఈ డయాబెటిస్ సమస్య మొదలైన నాటి నుండే నా ఇష్టాల పాలిట అది శత్రువుగా మారింది. ఒక్క ముక్కలో చెప్పాలంటే డయాబెటిస్‌గా పిలువబడే ఈ 'మధుమేహ' వ్యాధితో సతమతమవుతున్న నాలాంటి వారి జీవితాలలో అన్నీ కష్టాలే కదా!

ఈ డయాబెటిస్ మొదలైన నాటి నుండి గంటగంటకూ మూత్ర విసర్జన చేయవలసి రావడం, దాహం ఎక్కువగా ఉండటంతో అదేపనిగా మంచినీళ్ళు త్రాగటం, తీవ్రస్థాయిలో అరికాళ్ళ మంటలు, ఏ చిన్న గాయమైనా సరే ఎక్కువ నొప్పి పెట్టటం, ఎంతకీ మానకపోవటం మరియు కళ్ళ సమస్యలు, కాళ్ళ తిమ్మిర్లతో పాటు ఎన్నో రకాల బాధలు ఒక్కటొక్కటిగా ఎదుర్కోవాల్సి వచ్చింది. దాంతో శారీరకంగా, మానసికంగా చాలా బలహీనపడిపోయాను. నా స్నేహితుని సలహా మేరకు షుగర్ పరీక్ష చేయించాను, ఆ రిపోర్టు ప్రకారం నా రక్తంలో షుగర్ లెవెల్స్ అధికంగా ఉన్నాయని, అవి కూడా ఉండవలసిన మోతాదుకు మించి ఎక్కువగా ఉన్నట్లు, నేను టైప్-2 (నాన్-ఇన్సులిన్ డిపెండెంట్) డయాబెటిస్‌కు గురి అయినట్లు ఆ డాక్టరు గారు తెలిపారు.

డాక్టరు గారు సూచించిన మందుల కోర్సు వాడాను గానీ అంతగా ఫలితం కనిపించలేదు. అలా దాదాపు ఏడాది పాటు ఎన్ని మందులు మార్చి వాడినా డయాబెటిస్ దుష్ఫలితాల ప్రభావం నుంచి బయటపడలేకపోయాను. కానీ నా అదృష్టవశాత్తు ఒక రోజున TVలో 'హోమియోకేర్' ప్రకటన చూడటం జరిగింది. అదే రోజున అక్కడి డాక్టర్లను సంప్రదించాను. వారు నా సమస్యతో పాటు, నా వ్యక్తిగత అలవాట్లను, నేను ఎదుర్కొంటున్న దుష్ఫలితాలు కూడా క్షుణ్ణంగా తెలుసుకున్న అనంతరం, నాకు సరిపడిన మందులతో కాన్స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్‌ను ప్రారంభించారు.

కాన్స్టిట్యూషనల్ హోమియోపతి మందులు మొదలుపెట్టిన సంవత్సరం లోపునే అరికాళ్ళ మంటలు, అధిక మూత్ర విసర్జన, మలబద్దకం, కాళ్ళ తిమ్మిర్లు, మొ॥ లక్షణాలన్నీ క్రమంగా తగ్గిపోయాయి. ప్రస్తుతం నా షుగర్ లెవెల్స్ నియంత్రణలో ఉండటంతో హాయిగా ఉంటున్నాను. ఇదంతా కేవలం కాన్స్టిట్యూషనల్ హోమియోపతి సాధ్యం చేసి చూపించింది. ఇందుకు 'హోమియోకేర్ ఇంటర్నేషనల్' వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

**'మధుమేహ' వ్యాధి నియంత్రణకు మరియు దుష్ఫలితాల నివారణకు కాన్స్టిట్యూషనల్ హోమియోపతి వైద్యం సరైనది.**




**హోమియోకేర్® ఇంటర్నేషనల్**
వరల్డ్-క్లాస్ హోమియోపతి



వినాయకచవితి శుభాకాంక్షలు.

### డయాబెటిస్‌కు మా స్పెషాలిటీ చికిత్సలు

మధుమేహం • పెరిఫెరల్ న్యూరోపతి • సెక్స్ సమస్యలు • కిడ్నీ సమస్యలు • డయాబెటిక్ ఫుట్
కంటి సమస్యలు • చర్మ సమస్యలు • కొలెస్ట్రాల్ సమస్యలు

**టోల్ ఫ్రీ 1800 108 1212** | కన్సల్టేషన్ ఉచితం 955 000 1199

/homeocareint | www.homeocare.in

హైదరాబాద్ (అబిడ్స్, బేగంపేట్, దిల్‌సుఖ్‌నగర్, జూబ్లీ హిల్స్, కూకట్‌పల్లి, మాసబ్ ట్యాంక్, మియాపూర్), హనుమకొండ, కరీంనగర్, నిజామాబాద్, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, రాజమండ్రి, గుంటూరు, ఒంగోలు, నెల్లూరు. కర్ణాటక | తమిళనాడు | పుదుచ్చేరి

